Registered No. M-4484.

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] 1942 వ సం॥ జూ౯ నెల 19 వ తేది శుక్రవారం [నె 24 రు.

## రాజుగారికి అధ్యక్షునికి జరిగిన సందేశములు.

బ్రిటిషు రాజుగారు రష్యా సూప్రీము కౌన్సిలు అధ్యక్షునికి యిట్లు సందేశమంపిరి.—"మన సఖ్యత సంధి పత్రములందు నేడు సంతకములు జరిగినందుకు నాకు కలిగిన ఆనందము మీకు తెలుపకుండ నుండజాలను. ఈ సంధి, మన రెండు దేశాలు యిపుడు సాగించుచున్న తీవ్రమగు కష్టతరమగు యుద్ధమునందు చేయుచున్న కృషిని సార్థకంచేయుచు, మన విజయానంతరంకూడ అన్యోన్యసహాయం ఉండునట్లు నిర్ధారణచేయుచున్నది. నేను ముదమొందుచున్నట్లె మీరును ముదమొందుచూ యీ సంధికిస్వాగతమిచ్చుచు, యిది మన రెండు దేశాలకేగాక, ప్రపంచమంతకు మేలుచేయగలదని నావలెనే మీరుగూడ విశ్వసించుచున్నారను కొందును."

రష్యా అధ్యక్షులగు కాలినినుగారు రాజుగారికి యిట్లు వ్రాసిరి:

మన రెండు దేశాలమధ్య జరిగిన సఖ్యత సంధి సంతకములైనందుకు మీరు చెప్పినట్లే నేనును సంతసించుచున్నాను. ఇపుడు సంతకములయిన సంధి మన శత్రువుపై యుద్ధం చేయుటలో మన ఉభయదేశాల సమిష్టి శక్తిని యింకను దృఢపరచి విజయానంతరంకూడ అన్యోన్య సహకారము ధృవపరచునని నేను నమ్ముచున్నాను. మీవలెనే నేనుగూడ హృదయపూర్వకంగా యీ సంధిని ఆదరించుచున్నాను. ఇది మన రెండు దేశాలకేగాక ప్రపంచమంతకు లాభించునని నమ్ముచున్నాను."

రష్యా దినము

సోమవారం

22 జూను 1942.

ఇంగ్లాండు-రష్యా ఒడంబడికగూర్చి జార్జి యంగుగారు యిట్లు వ్రాస్తున్నారు:—ఇంగ్లాండు-రష్యాలు యుద్ధంలోకలసి పనిచేయుటకు ఒడంబడిన దాని ఫలితంగా యుద్ధానంతరం శాంతి సమయంలోకూడ పనిచేయుటకు సంధిచేసుకొనుట సహజము. న్యాయమును స్వాతంత్రమును కాపాడుటకై వ్యక్తులు ఎట్లు శ్రద్ధవహించి అధర్మమునెదిరించెదరో దేశాలుకూడ అట్లే, ఇదివరకు మనకు రష్యా పద్ధతులు నచ్చేవిగావు. ఇపుడు ఉభయులము సమాన లక్ష్యంతో పనిచేయుచున్నందున, యిదివరకు అసహజమనుకొన్న పద్ధతులలోగూడ యేదోఘనతయుండునని యిపుడనుకొనుటకు వీలేర్పడుచున్నది. యుద్ధంలో దేముడు కలిపినవారిని శాంతి సమయాలలో మనుష్యమాత్రులు విడదీయకుందురు గాక, నేనీ వాక్యాలు వ్రాస్తున్ననాడే అమెరికాఅధ్యక్షుడు మన ప్రధానియు రష్యా ప్రధానమంత్రిని ఆహ్వానించి యీ మూడు దేశాలలో ఉత్పత్తిశక్తి యెట్లుకలిపి, విజయమునకు తోడ్పడునట్లు కృషిచేయవచ్చునో యోచింపదలచిరి. దానితో సంపూర్ణ విజయమును బడయగలం. యుద్ధంలో కష్టపడి జయించినవారే, శాంతి సమయపు యేర్పాటులను నిర్ణయించగలరు.

# రష్యా - బ్రిటను 20 సం॥ల ఒడంబడిక.

## జర్మనీకి ప్రతికూలంగా అన్యోన్య సహకారసంధి.

హిట్లరు అధికారమునందున్న జర్మనీపైని దాని మిత్ర దేశాలపై యుద్ధం కొనసాగించుటకున్ను, అటుతరువాతకూడ ఒండొరులకు సహాయంచేసుకొనుటకున్ను, సోవియటు సోషలిష్టు రిపబ్లికు యూనియనుకున్ను యునైటెడు కింగుడము (ఇంగ్లాండు ప్రభుత్వము) నకును జరిగిన సఖ్యత సంధి షరతులు యీ దిగువరీతిగ నున్నవి :—

1 వ షరతు.—యునైటెడు కింగుడమునకు సోవియటు యూనియనునకు ఏర్పడిన సఖ్యత ననుసరించి యీ సంధిచేసుకున్న పెద్ద రాజ్యాలు, యూరోపులో దురాక్రమణకు గడంగిన జర్మనీ పైని దానికి సహాయంచేయు రాజ్యాలపైని యుద్ధం చేయుటకును, ఒండొరులకు సైనిక సహాయం యితర సహాయములు చేసుకొనుటకును ఉభయులు అంగీకరించుచున్నారు.

2 వ షరతు.—జర్మనీతోగాని దానితోచేరి దురాక్రమణకు గడంగిన యితర రాజ్యాలతోగాని ఒకరి అనుమతిలేకుండా యింకొకరు సంధి రాయబారములు జరుపరాదు. హిట్లరు అధికారము నందున్న, జర్మను ప్రభుత్వంతోగాని, దురాక్రమణ ఉద్దేశాలు పోగొట్టుకోకుండాయున్న యితర రాజ్యాలతోగాని, యీ సంధిచేసుకున్న రెండు దేశాలవారు ఎటువంటి రాయబారాలు జరుపరాదు.

3 వ షరతు.—(1) యుద్ధానంతరం దురాక్రమణను నిరోధించి శాంతి కాపాడుటకు తోడ్పడు చర్యల కంగీకరించు దేశములన్నింటితో యీ రెండు రాజ్యాలవారు కలసి సఖ్యతగనుండుటకు వాంఛించుచున్నట్లు ప్రకటించుచున్నారు. (2) అట్టి చర్యలు నిర్ణయించబడువరకు, యుద్ధం ముగిసినపిదప, తిరిగి యిటువంటి దురాక్రమణ జరుగకుండుటకును, జర్మనీకాని దాని మిత్రదేశములుకాని తిరిగి శాంతిభంగం చేయకుండునట్లు యీ రెండు రాజ్యాలు తమ శక్తికొలది పాటుబడెదరు.

4 వ షరతు.—ఈ సంధి సంతకంచేసిన రెండు రాజ్యాలలో యే రాజ్యం పైనగాని జర్మనీయో పైన 3 వ షరతు (2) లో సూచించిన యితర రాజ్యాలో శత్రుత్వం వహించి దాడిచేసినచో, రెండో రాజ్యం తనకు వీలయిన సైనిక సహాయమేగాక సర్వవిధములగు సహాయం చేయవలెను. 3 వ షరతు (1) లో సూచించిన చర్యలు అనుసరింపబడిన పిమ్మట, యీ షరతులో నియమములు అనుసరింప నవసరంలేదని ఉభయు లంగీకరించు నంతవరకు, యీ నియమములు అమలునందుండును. 3 వ షరతులో సూచింపబడినటువంటి చర్య లంగీకరింపబడకున్నచో యీ షరతులోని నియమములు 20 సంవత్సరములవరకు అమలునందుండును. ఆ తరువాతగూడ 8 వ షరతులో సూచింపబడినట్లు ఉభయులలో ఎవరు అంతముచేసినా యీ సంధిని అంతం చేయవచ్చును.

5 వ షరతు.—ఈ రెండు రాజ్యాలకు తమ భద్రత ముఖ్యమయిన విషయం కావున, శాంతి స్థాపింపబడిన పిమ్మటకూడ యూరోపులో భద్రతకై కట్టుదిట్టములు చేయుటకును, ఆర్థికాభివృద్ధి చేకూర్చుటకును యివికలసి పనిచేయును. ఈ కార్యం సాధించుటయందు సంయుక్త రాజ్యాల శ్రేయమునుగూడ గమనింతురు, తమయొక్క రాజ్య విస్తీర్ణమునకుగాని, ఇతర దేశాల స్వంత వ్యవహారములందు జోక్యము కలిగించుకొనుటకు గాని యీ రెండు రాజ్యాలవారు ప్రయత్నించరు.

6 వ షరతు.—యుద్ధానంతరం వీలగు ఆర్థిక సహాయం ఒండొరులు చేసుకొనుటకు అంగీకరించుచున్నారు.

7 వ షరతు.—ఈ రెండు రాజ్యాలలో ఒకరికి ప్రతికూలంగా రెండోవారు అన్యులతో సంధి జేసుకొనుటగాని, రాయబారాలు నడుపుటగాని చేయరాదు.

8 వ షరతు.—ఈ సంధి వీలయినంత త్వరలో దృవపరుచవలెను. దృవపరచు పత్రములు మాస్కో నగరంలో వెంటనే ఒండొరుల కందజేసుకోవలెను. అందజేసుకోగానే అమలునకు వచ్చును. ఇది అమలుజరిగి నప్పటినుండి అదివరకు 1941 వ సం॥ జూలై 12 వ తేదిన బ్రిటిషు ప్రభుత్వమునకు రష్యా ప్రభుత్వమునకు మాస్కోలో జరిగిన ఒడంబడిక రద్దగును.

ఈ సంధిలోని ప్రధమభాగం మొదటి రెండు షరతులును, యీ దేశానికి జర్మనీకి దాని మిత్ర దేశాలకు శతృత్వంపోయి శాంతి తుదిరేవరకు అమలునందుండును.

2 వ భాగం (3 నుండి 7 వరకుగల షరతులు) 20 సంవత్సరములవరకు అమలునందుండును. ఆ తరువాత 12 నెలల నోటీసు వ్రాతమూలకంగా యిచ్చిన, ఆ 12 నెలల అనంతరం యీ ఒడంబడికలోని రెండో భాగం రద్దగును. అంతవరకు అమలునందుండును.

ఈ ఒడంబడిక లండనులో 1942 వ సం॥ మే 26 వ తేదిన పుట్టింది. ఇంగ్లీషు, రష్యను భాషలలో వ్రాయబడింది. రెండూ అధికార రీత్యా అంగీకరించబడినవే. ఈడెనుగారు ఇంగ్లాండు తరపున, మాలటావ్‌గారు రష్యా తరపున సంతకములు చేసిరి.

సంధి ప్రయోజనములు.

సంధి ప్రయోజనములగూర్చి పీఠికలో యిట్లు తెలుపబడినది.—ఇంగ్లాండు రాజుగారును, సోవియటు రష్యా సూప్రీము కౌన్సిలు అధ్యక్షుడును యీ దిగువ ఉద్దేశాలతో సంధి చేసుకున్నారు.— జర్మనీతో యుద్ధం కలిసిచేయుటకు 1941 వ సం॥ జూలై 12 వ తేదిన మాస్కోలో చేసుకున్న ఒడంబడిక షరతులను ధృవపరచుటకు వేరొక సంధి చేసుకొనుట; యుద్ధానంతరం శాంతి కాపాడుటకును, తిరిగి జర్మనీగాని దాని మిత్ర రాజ్యాలుగాని యూరోపులో దురాక్రమణకు గడంగకుండునట్లు చేయుటకును; యుద్ధం ముగిసినాక సంధిచేయునవుడు ఒండొరులు కలసి పనిచేయుటకును, యితర సంయుక్త రాజ్యములతోకలసి పనిచేయుటకును; 1941 వ సం॥ ఆగస్టు 14 వ తేదిన అమెరికా అధ్యక్షుడును బ్రిటిషు ప్రధానియు ఒక ప్రకటన గావించిరి, ఆ ప్రకటనకు రష్యా ప్రభుత్వంకూడ అంగీకరించింది. దానిలోని సూత్రముల ప్రకారము యుద్ధానంతరం పునరుద్ధారణ కార్యము చేయుటకును, చివరకు యీ సంధి చేసుకొన్న రెండు దేశాలలో దేనిపైనైన జర్మనీగాని దాని మిత్రదేశాలుగాని దాడి చేసినచో అన్యోన్యసహాయం చేసుకొనుటకును యీ సంధి చేసుకొనబడెను.

## జర్మనులను మించిన రష్యనులు

ప్రత్యేక వ్యక్తులను పోల్చిచూస్తే జర్మనువాడిని రష్యావాడు మించిపోవును. నెపోలియను చక్రవర్తియే యీ నిర్ధారణ చేసెను. గత యుద్ధంలోవలెనే రష్యనులు యీ యుద్ధంలోకూడ ఎదురుపడి తుపాకులతో జరిగే యుద్ధాలన్నింటియందు గెలవగలరు. ఎర్రసైన్యం యిదివరకువలె ప్రభువులు ధనికుల జమీందారీలను రక్షించుటకు యుద్ధంచేయుటలేదు. సంఘమంతకు చెందిన జాతీయ సంపదను కాపాడుటకు యుద్ధం చేయుచున్నది. సైనికోద్యోగులకు సైనికులకు అదివరకుండిన విద్యావిషయక వ్యత్యాసం తొలగిపోయింది. ఇదివరకుకన్న సైన్యం కట్టుదిట్టాలు సమర్థత ఎక్కువైనవి. చుట్టునున్న ప్రాంతాల శత్రువు కాలిడ వీలుండదు. వెనుకటి 1812 వ సం॥ ఉత్సాహం యిప్పటి ఉత్సాహంముందర పనికిరాదు. స్టాలిను 5 సంవత్సరముల ప్లాను వలన ఉత్పత్తి యెక్కువయింది. నేడు రష్యా కార్మికులు ప్రతి పనియందు యిదివరకుకన్న రెండింతలు ఎక్కువ ఉత్పత్తి చేయుచున్నారు.

బెర్నార్డు షా గారు రష్యాలో కొంతకాలం పనిచేసిన ఆంగ్ల గ్రంధకర్త పైవిధముగ వ్రాసెను.

# రష్యాలో గొరిల్లా యుద్ధము.

## జర్మనులకు శాశ్వతమగు వినాశ హేతువు.

ఆధునిక యుద్ధం ఎంత యంత్రసాధనముల పై నాధారపడినదైనప్పటికి, కేవలం యుద్ధమే వృత్తిగాగల సిపాయిలపైనే ఆధారపడి యుండ లేదు. ఎక్కడెక్కడనున్న ప్రజలయినాసరే, తమ యిళ్లు వాకిళ్లు రక్షించుకోదలచిన వారందరికి సంబంధించిన వ్యవహారమయి యున్నది. ఆ విషయం సైనిక వృద్ధులింకా గుర్తించినట్లు లేదు.

మిత్ర మండలిలో ఒక సేనా నాయకుడు యీ విషయం బాగుగ గుర్తించి, సామాన్య ప్రజలందరి సహాయమును యుద్ధరంగంలోనే బడయుటకు తగు యేర్పాటులు చేసెను. అతడు రష్యను సేనా నాయకుడు, ఆధునిక యుద్ధంపూచీ మీపైని నా పైనిగూడగలదు. ఆ విషయం గుర్తించి అతడు గొరిల్లా సైనికుల నెందరినో తయారుచేసెను. రష్యాలో యీగొరిల్లాలను పార్టిజానులంటారు. వారు యుద్ధ క్రమాన్నిమార్చలేక పోయిరి. కాని దేశాన్ని ఆక్రమించుటకు జర్మనీ సైనికుల ఎత్తులను బాగా నిరోధింపగల్గిరి.

నేను, రష్యా-జర్మను యుదం ప్రారంభమయి నాక ఏడు నెలలు రష్యాలోనుంటిని. కనుక రష్యనుల యుద్ధ యత్నములగూర్చి యితరుల కంటె బాగా తెలుసుకొన గల్గితిని.

యుద్ధం ప్రారంభం కాకమునుపే రష్యా సైనికాధికారులు. జర్మనులు తమపై దాడివచ్చి నచో ఎఱ్ఱ సైన్యాలు (రష్యావి) తిరిగికొట్టు లోపున, కొంత నేల వదలుకోవలసి యుండునని గుర్తించియుండిరి. అందుచే వారు గ్రామాల లోనికి పొలాలలోనికి పోయి, గోరిల్లా యుద్ధ మును ప్రజలకు నేర్పిరి. ప్రతి గ్రామంలో యీ గోరిల్లా జట్టు గ్రామనాయని స్వాధీనమునందుం డును. వారి ఉపయోగార్థము ఆహార పదార్థాలు, ఆయుధాలు రహశ్యమగు తావులందుంచి "శత్రు వువచ్చినచో ఆతన్ని నరకంలో త్రోసే ఏర్పాటులు దాచియుంచిన "మందుగుండుతో చేయవలె"నని సూచించిరి.

గోరిల్లా సైనికులకు మంచి సదుపాయ మోటి గలదు. వారు వారి స్వగ్రామములందుండి తెలి సిన జాగాలందే చాటుగానుండి శత్రువుతో యుద్ధం చేయుదురు. కావున తప్పించుకోగలరు. శత్రు వుకి ఆతావులు మార్గాలు తెలియవు కావున చిక్కు పడును.

రష్యా వృత్తిసైనికుడు త్రోవతప్పి, తన సైనికదళంనుండి విడిపోయినచో యీ గోరిల్లాలు వానికి దారిచూపి, తిరిగి దళంలో చేర్చగలరు. లేదా తమకు యుద్ధంచేయుట నేర్పుటకు గురువు గనో కెప్టనుగనో ఉంచుకొందురు.

గోరిల్లాలు తమ గూఢమగు చర్యలవలన శత్రువునకు చాల భయం కలిగించగలరు. అది ముఖ్యమయిన ఫలితం. అక్కడనుండు జర్మను లకు వారు శాశ్వతమగు మారకులుగ నుండ గలరు. గోరిల్లా సైనికులు ఎపుడువచ్చి మీద పడి నాశనం చేయుదురో అన్న భయంలోనే సర్వదా జర్మనులుందురు. గోరిల్లాలు మంచి దేశాభిమానులు, అన్నింటికన్న ఎక్కువగ తమ దేశ స్వాతంత్ర్యమునే వారు కోరేదరు. అందు కొరకే వారు సైనికశిక్షణ లేకున్నాగూడ యుద్ధం చేయగలరు.

(ఢిల్లి రేడియోలో ఫిలిప్ జోర్డను గారి ఉపన్యాసనుండి.)

# సోవియటు రష్యాకు సప్లైలు.

## మార్మాంస్కు—మాస్కో రైలుమార్గమున దృశ్యములు

నెగ్లీ ఫార్సనుగారు యిట్లు వ్రాస్తున్నారు.— మిత్రమండలి వారివ్వదలచిన టాంకులు, ఫిరం గులు విమానాలన్ని రష్యనులకిస్తే వారి ఎఱ్ఱ సైన్యం వాటిని తెలివిగా ఉపయోగించగలరు.

రష్యాలో కొద్ది నెలలున్నపిదప నాకు పై విధంగా తోచింది. ఈ యుద్ధంలో అంతుచూడా లను పట్టుదల రష్యనులకుగలదు. అందుచే మనంపంపే సరకేదీకూడా వారు వృధాచేయరు.

మాస్కోనుండి ఇంగ్లాండునకు మరలి వస్తు న్నప్పుడు, మార్మాంస్కు రైలు మార్గమున నేను 10 రోజు లుండవలసివచ్చింది. ఒకటి రెండు రోజులు మా రైలు 50 మైళ్లేనా పోలేదు. ప్రతీ చోట నిలచిపోయి ప్రక్క లైనులమీద నిలస్తూ వుండేది. మా రైలునిండా సిపాయీలు, నౌకా దళోద్యోగులు వున్నారు. ఇంత ఆలశ్యమగుచు నిలచిపోతూవుంటే మేము ఒక విషయం తెలును కొంటిమి: ఆర్కిటికు సముద్ర మార్గమున వచ్చి మార్మాంస్కు రేవుగుండా దిగుచున్న యుద్ధ సామగ్రికన్న, మా బండిలోనున్న మను ష్యులను మోయుట రైల్వే వారికంత ముఖ్య మయిన పనికాదని. ఆ సరకు రైళ్లు ఎదురుగా తెంపులేకుండా వస్తూవుంటే, మా రైలు నిలిపేస్తూ వుండేవారు.

విమానాలతో నిండియున్న గూడ్సు ట్రక్కు లు, కాన్వాసులు కప్పియున్న టాంకులు, బ్రిటిషు- అమెరికను కంపెనీల పేర్లు ముద్రించియున్న మందుగుండు పెట్టెలు గుడ్సు బండ్లలో దిగుతూ వుంటే చూడ విద్దూర్యంగా నుండెను.

మాస్కోకు—మార్మాంస్కోకు మధ్యగా నుండు ఒక స్టేషనువద్ద నేను రెండు రోజులు వేచియుండవలసివచ్చింది. ఆ రెండు రోజులు నేను ఏమి తోచక చికాకుచెంది, కూలీలు సరకు దించుతూవుంటే చూస్తూ కూచున్నాను. క్రేను లుగాని, యంత్రాలుగాని లేక బలవంతులగు రష్యనులే వేలకొలది జనం, గూడ్సు పెట్టెలలో నుండి బరువైన ఆ సామగ్రి దించుచున్నారు.



ఇంగ్లీషువారికి సహాయంగా అమెరికా పంపిన టాంకులలో నొకటి ఈజిప్టు రేవులో దిగుట.
ఆఫ్రికా ప్రాంతములకు అమెరికా యుద్ధసామగ్రి విశేషంగా చేరింది.

మోటారుకారులనుగూడ రోడ్డుపై చేతులతో తోసియే దింపుచున్నారు. అదంతా చూస్తే ఇంగ్లాండు - అమెరికాలు చేస్తున్న సహాయాన్ని వారెంత అభిమానంగా ఆదరిస్తున్నారో బోధపడింది.

మార్మాంస్కు రేవునందు యిప్పుడే పనివారు తీరికలేకుండా, కాలు కదపడానికి వీలులేనంత క్రిక్కిరిసిగానుండి సామానులు నావలనుండి దించుచున్నారు. వారి శ్రద్ధచూస్తే ఆ సరకు దిగిపోయి ఉపయోగించేవరకు తొందరపడుచున్నారనిపిస్తుంది. సరకు గిడ్డంగులను కావలాకాయు స్త్రీలు విమానదాడి వచ్చినా భయపడరు. అక్కడనుండి కదలరు.

నేను రష్యాకు పోయినప్పుడు నౌకల జట్టు (కాన్వాయి) తో పోతిని. ఆ స్టీమరులనిండా యుద్ధ సామగ్రి యుండెను. మార్మాంస్కు రేవులో దిగేసరికి రష్యను కూలీల ఆందోళన తొందరచూస్తే, వారా సరకు అందుకొని ఉపయోగించేవరకు మనసునపట్టదేమోననిపించింది. ఇదిచూచి నాయింత తెగించి యీ ప్రయాణం చేయడం వ్యర్థంకాలేదని ఒక స్టీమరు కేప్టను నాతో ననెను.

రష్యాకు సరకు స్టీమరులలో తీసుకపోవడం అంత సులభమయిన పనికాదు. అయినా యీ సరకు తెచ్చిన నావికులు యింకోసారి రష్యాకు రావాలనే కోరుచుండురు. బ్రిటిషు నావికులు యీరీతి సరకు రవాణాచేయడం మెచ్చదగియున్నది. బ్రిటిషు-రష్యను సహకారమునకు యిది మంచి నిదర్శనము.

# సయాం గతి ఏమయింది.

## జపాన్ను మంచిచేసుకున్న ఫలితం.

జపాన్ను మంచిచేసుకుంటే ఇండియాకు శ్రేయస్కరమని భావించేవారు కొందరీ దేశంలో యున్నారు. అట్టివారు సయాం గతి ఏమయిందో యించుక ఆలోచించడం మంచిది. సయాంలో సంగ్రామము ఫాసిస్టువర్గంవారు ఆ దేశాన్ని జపానుకి ఒప్పగించిరి. ఆ వర్గంలోని రాజకీయ వేత్తలను జపాను ముందు వశపరచుకొంది. వారు తమ దేశానికి ద్రోహంచేసిరి. ఇండో-చీనాలో గల సయాం సరిహద్దు తగవులో జపాను ప్రభుత్వం సయాం పక్షముండెను. సయాంకి 20 లక్షల యెన్నుల (జపానునాణెం) ఋణమిచ్చి, ఉభయులకు లాభదాయకంగానుండు వర్తక ఒడంబడిక చేసుకుంటామని జపాను వాగ్దానం చేసింది. తగవు పూర్తియైనాక ఇండో-చీనానుగూడ కబళించింది.

ఇదంతా జపాను యుద్ధంలో దిగిన డిశంబరు 7 వ తేదీకి పూర్వం. యుద్ధం ప్రారంభమయినాక పై రెండు దేశాలు, తమ లాభంకొరకు కాక, జపాను లాభంకొరకే యీ ఒడంబడికలన్ని చేసుకోవడం అని గుర్తించేయి. జపాను వాగ్దానంచేసిన 20

లక్షల ధనసహాయం వాగ్దానరూపంలోనే ఉంది. ఇప్పటికా డబ్బు సయాంకి చేరలేదు. పైగా 800,000 టన్నుల బియ్యం సయాంనుండి జపాను తీసుకుంది. సయాంలోని విమానాశ్రయాలు, జపాను తీసుకొంది. బాంకాకు రేడియో టోకియోకు ప్రచారసాధనగ మారింది. సయాం భాషకుగూడ యీ తాకిడి తగిలింది. అందు 5 అచ్చులు 13 హల్లులు తీసేయాలని జపానువారు ఉత్తరువు చేసేరు.

బాంకు నోట్లు యికముందు టోకియోలో ముద్రిస్తామని టోకియో రేడియో యిటీవల ప్రకటించింది. సయాంలో బాంకులు జపానువశం కాకముందు, జపానువారు 156 యన్నులిచ్చి కొనే సరకు యిపుడు 100 యన్నులు మాత్రం యిచ్చి కొనగలరు. ఆ రీతిగా మారకం రేటు మార్చివేసేరు. జపానునుండి వచ్చే సరకులకు సయాం నూరు యిచ్చేచోట 150 యివ్వవలసి వచ్చింది. వ్యవసాయపు ముడివస్తువులు నిర్బంధంగా సయాం జపానుకి పంపాలి. వాటికి మిట్సుయి, మిట్సుబూషి బాంకులు ఎంత ధర నిర్ణయిస్తే అంతే లభిస్తుంది.

చివరకు సయాం ప్రభుత్వస్థానంకూడా బాంకాకునుండి కురబూరి అనుచోటికి యింకా 110 మైళ్లు తూర్పునకు మార్చివేయబడునని నిచినిచి షింబూము అను పత్రిక ప్రకటించింది, మంచూరియాను జపాను ఆక్రమించిన పిదపగూడ యిట్లే చేసేరు. పాతవిధానం పూర్తిగా మారిపోవాలని వారిట్లు చేయుటేగాక, క్రొత్త చోట జాగాల విలువ పెరిగితే కొందరు జపాను ఉద్యోగులకులాభంకలదు కనుక యిట్లు మారుస్తూ వుంటారు.

అయితే సయాంలో జాతీయోద్యమం పెంపొందించడానికే తాము ఆదుర్దపడుచున్నామని జపానువారు భేషజం పల్కుచుందురు. మే 13 వ తేదీన బాంకాకు రేడియో యిట్లు తెలిపింది.

"తాయి వస్తువులన్ని ఆదరించండి—నిద్ర లేచిందగ్గరనుండి తిరిగి పడుకునేదాగా అన్నీ తాయిగురించే స్మరిస్తూ వుండండి—తాయి వస్తువులే కొనండి, రేడియో యంత్రాలుకూడా తాయివే కొనండి." (తాయిలాండు అంటే సయాం) తాయి రేడియోలకు 2 వాల్యులేయుండి, ఆదేశం ప్రచారం తప్ప యితరదేశాలు వినబడవు.

---

# సమారాధన! సమరారాధన!!

ప్రస్తుతం హిట్లరుయొక్క జర్మను సేనలు ఎక్కడైనా, ఏమైనా యుద్ధం చేయుచున్నవా? యుద్ధం చెయ్యడానికి ముహూర్తం ఇంకా బాగా లేదని హిట్లరు మీనమేషాలు లెక్కపెట్టుకుంటున్నాడా? అసలు, యీ మహాసంగ్రామం ప్రారంభించినవాడు హిట్లరు-జపానున్నూ ఇటలీయున్నూ యీ హిట్లరు రౌడీకి శిష్యులుగాచేరి వెంటతిరగడం ప్రారంభించారు. కాబట్టి యుద్ధముయొక్క పర్యవసానం తెలవలెనంటే, హిట్లరుయొక్క అంతు తెలియాలి. హిట్లరు గెలిస్తే ప్రపంచంలో యుద్ధంఅనేది స్థిరస్థాయిగా ఉంటుంది. హిట్లరుచే జయింపబడిన రాజ్యాలు యావత్తు జర్మను క్రూర నిరంకుశత్వానికి లోబడియుండవు. తిరిగి సమరం చెయ్యడానికి సమయంచూస్తూనే ఉంటాయి. అంతవరకూ లోకానికి శాంతిలేదు. అంతవరకూ, యీ క్రోధాగ్ని రగులుతూనే ఉంటుంది. అక్రమంగా జయించిన రాజ్యాలు అనుభవంలోకి రావు. అన్యాయంగా ద్రోహంచేసి సంపాదించిన ఆస్తి నిలిచేదికాదు. ఆశకొలదీ, తినిన తిండి అజీర్తిచేస్తుంది. తిన్నవానికే అది విషమవుతుంది. దురాశ దుఃఖంచేటు. కాబట్టి యీవిధంగా రాజ్యాలన్నీ జయించిన జర్మనీ లోకంలో శాంతి ఏర్పడేటట్లు చేయగలదా? పోనీ, అంతవరకూ ఎందుకు? జర్మనీవాళ్లు యిన్నిరాజ్యాలను అక్రమంగా జయించి తమ అధికారంక్రింద ఉంచుకోగలరా? జర్మనీవాళ్లకు మాత్రం మనశ్శాంతి ఏమైనా ఉంటుందా? కాబట్టి హిట్లరు గెలిస్తే, జర్మనీకి శాంతిలేదు. లోకానికి శాంతిలేదు. జయించినవన్నీ జీర్ణము కాకపోవుటవల్ల వాంతి కావలసిందేగాని, శాంతి అనేది లేదు.

కనుక, హిట్లరు ఓడింపబడక తప్పదు. హిట్లరుమూలంగా జర్మనీలో నాజీపార్టీ అనేది ప్రబలమై ప్రభుత్వాధికారంలోకి వచ్చింది. ఈ నాజీపార్టీయొక్క రాజ్యదాహంమూలంగా యీ మహాసంగ్రామం సాగుతున్నది. ఇటువంటి రక్తదాహం, రాజ్యదాహంగల నాజీపార్టీ అంతరించాలి. ఈ నాజీప్రభుత్వం అంతరించవలెనంటే, యీ నాజీపార్టీకి నాయకాగ్రేసరుడైన హిట్లరును ఓడించాలి. హిట్లరు బలాన్ని అట్లా

ఇట్లా కాకుండా, అట్టు మాడ్చినట్లుగా, నామ రూపాలు లేకుండా నాశనంచెయ్యాలి. జర్మనీలో నాజీతత్వం నశిస్తేనేగాని, జర్మనీతో రాజీ అనేది అసంభవం. హిట్లరు పోతేనేగాని, హిట్లరు యొక్క పార్టీ పోతేనేగాని, హిట్లరు రగుల్కొల్పిన యీ సంగ్రామాగ్నిజ్వాలలు చల్లారవు. వివిధరాజ్యాల క్రోధాగ్నిజ్వాలలు చల్లారవు. భస్మాసురు డున్నంతకాలమూ, లోకం భస్మమవుతూనే ఉంటుంది. కాబట్టి, హిట్లరు ఓడింపబడితేనేతప్ప, లోకానికి శాంతిఅనేది లేదు. ఎవరు గెల్చినా, ఎవరు ఓడినా, ఏదోవిధంగా యుద్ధం సమాప్తమై, సంధిపత్రాలు వ్రాయబడితే, శాంతి కలుగుననేమాట వట్టి భ్రాంతి. " తనయందు నిఖిల భూతములందు నొకభంగి సమహితత్వంబున-జనెడువాడు-" అన్నట్లుగా ప్రవర్తించడమే ప్రజాస్వాతంత్ర్య తత్వం-ప్రజల కందరికీ సమానమైన అభిప్రాయ స్వాతంత్ర్యం, సమానంగా అవకాశములను వినియోగించుకొనే స్వాతంత్ర్యం ఉండాలి అనే ధర్మసూత్రమును అనుసరించిన ప్రజాస్వపరిపాలనా పద్ధతులే ఉత్తమమైన ప్రభుత్వ పద్ధతులని యెంచి మిత్రరాజ్యాలవారు ఆ ప్రజాస్వాతంత్ర్య ధర్మమునే శిరసావహిస్తున్నారు. తాను అభివృద్ధిలోనికి వచ్చుటకు ఏవిధంగా అవకాశం ఉండవలెనో, ఇతరులకుకూడా అటువంటి అవకాశములే ఉండాలి. "ఆత్మవత్ సర్వభూతాని"—తనవలెనే ఇతర ప్రాణులనుకూడా భావించవలెననే పరమార్థం ప్రజాస్వామ్య ప్రభుత్వ పద్ధతిలో అంతర్గతమై ప్రకాశిస్తోంది. ఈ ప్రజాస్వామ్యధర్మజ్యోతి, యీ జ్ఞానతేజం, యీ ఆత్మ స్వాతంత్ర్య కాంతి వెలుగుతూ ఉన్నంత కాలమే లోకానికి శాంతి. ప్రజాస్వాతంత్ర్య కాంతి లేనిచో శాంతిలేదు. కనుక, నాజీతత్వం గెలిస్తే లోకానికి శాంతిలేదు. నాజీతత్వం నశిస్తే లోకానికి స్థిరమైన శాంతి ఏర్పడగలదు.

అందువల్ల, క్రిందటి ఆదివారమునాడు, ప్రజాస్వాతంత్ర్య రక్షణార్థం పోరాడుచున్న మిత్ర రాజ్యాలన్నింటియొక్క జెండాలను గౌరవించి, ఆ పతాకములకు నమస్కరించవలెనని అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రెసిడెంటయిన రూజువెల్టుగారు ఒక ప్రకటన చేసారు. ఆప్రకారంగానే, ఆనాడు ప్రజాస్వాతంత్ర్య సంరక్షణార్థము, నాజీతత్వ నిర్మూలనార్థము ఏకీభవించిన రాజ్యములన్నింటియొక్క జెండాలను, మిత్రమండలి రాజ్యము లన్నింటియందును పూజించారు. ఆనాడు జాతీయపతాక సమారాధన జరిగింది.

గత ఆదివారంనాడు ఒకవైపున రూజువెల్టుగారి సంకల్పానుసారం యీ సమారాధన జరుగుతూఉంటే, ఇంకొకవైపున జర్మనులు సమరారాధన సాగిస్తూనే ఉన్నారు. లిబియాలో బ్రిటిష్ సేనలతో, భారతీయ పటాలములతో, స్వతంత్ర పక్ష ఫ్రెంచి సైన్యములతో, అమెరికను విమాన దళములతో, దక్షిణాఫ్రికా ప్రభుత్వ విమానదళములతో, జర్మను ఫిరంగి మోటారు పటాలములు భీకరమైన యుద్ధం చేయుచునే యున్నవి. ఆ రంగస్థలం భగ్గుమని మండిపోయే ఎడారి. అది ఎడారికాదు: అది నరకమునకు దారి. సాక్షాత్తు హోమాగ్నిగుండం. ఇసుక దుమారం హోమ ధూమంలాగున నిరంతరంగా పైకిలేస్తూ ఉంటుంది. ఆ ఇసుక దుమారంలో చూపు కన్పించదు. అటువంటి లిబియా యుద్ధరంగంలో జర్మనుసేనలు ఎంత వేడికైనా సహించి ఎండలలోనే ఎండి, మొండిపోరాటం సాగిస్తున్నారు. టొబ్రూకు కోటను పట్టుకోవలెనని ఇదివర కొక సంవత్సరం ప్రయత్నించారు కాని, సాధ్యం కాలేదు. ఈసంవత్సరంకూడా ఆప్రయత్నం సాగించారు. టొబ్రూకు కోటకు అనేక దుర్గమ ప్రాకారములు జిలేబీ చుట్టవలె ఉన్నాయి. ఆ ప్రాకారాలన్నీ భేదించడం పద్మవ్యూహం భేదించడంవంటిది. కాని, దానిని భేదిస్తేనేగాని లిబియాలో జర్మనులు జయించలేరు. లిబియాఅంటే వేడివేడి జిలేబియా? ఇక్కడ టొబ్రూకువద్ద వారిపప్పు ఉడకదు.

---

# భారతీయ సేనలకు వినోదాలు.

## ఇండియానుండి నృత్యబృందం, గారడీవారు సైనిక శిబిరాలకు పోవుట.

ఆఫ్రికా ప్రాంతములందున్న భారతీయ సేనలకు వినోదములు కల్పించుటకై ఇండియానుండి రెండు జట్లు యిటీవలనే బయలుదేరి వెళ్లినవి. ఒక జట్టులో ఒక సుప్రసిద్ధ సినిమా తారతో గూడిన నాట్య బృందము, యింకో జట్టులో గారడీవానితోగూడిన చౌచౌ ప్రదర్శకులు పోయిరి.

పంజాబులో సహకార సంఘములన్ని కలసి యింకో రెండు వినోదపు పార్టీలను తయారు చేయుచున్నవి. వారును త్వరలో విదేశాలకు పోయి అట యుద్ధరంగాలందు యుద్ధంచేసి విసిగియో, కాపలాయుండి విసుగు చెందియోయున్న మన సైనికులకు కొన్ని వినోద ప్రదర్శనములు చూపి ఉత్సాహం కలిగించగలరు. ఇతర రాష్ట్రములనుండికూడ పంపుటకు ఏర్పాటులు జరుగుచున్నవి. ఇప్పటివరకు వెళ్లినవారు చాల సమర్థులు, బాగుగ ప్రదర్శించి ప్రేక్షకుల సంతుష్టి పరుచగలవారయినను, వారి సంఖ్య చాలదు. ఇంక నెందరో ఎక్కువమంది కావాలి.

నటకులు, పాటకులు, ప్రదర్శకులు విదేశాలకు పోదలచినవారు యింక నెందరో కావలసియున్నారు. వెళ్లదలచినవారు ఎ. సి. ఇ. ఎస్. డైరక్టరేటు, ముఖ్య కేంద్రస్థానం సిమ్లా అని వ్రాసి దరఖాస్తులు పంపుకోవలెను.

విదేశాలందున్న భారతీయులకు కావలసింది యింకోటి ఏమంటే, రంగుల బొమ్మలుగల గోడలకంటించే ప్రకటన కాగితాలు. అవి ఆస్పత్రులందు, వారి నివాసపు గుడిసెల గోడలకును, అంటించియుంచినచో ముచ్చటగ ఆనందముగ నుండగలదు. కావున ఇండియాలో వ్యాపార సంస్థలు, రంగుల అడ్వర్టైజుమెంటు కాగితాలను, పోస్టర్లు వీలయినన్ని పంపుట మంచిది.

# మన విమానాల విజయం.

బర్మాలో జపాను ఆక్రమించిన ప్రాంతములపై మే మాసంలో మన విమానాలు 60 సార్లు తక్కువలేకుండా దాడులు జరిపినవి.

బంగాళాఖాతంలో బియ్యం ఎగుమతిచేయు రేవుస్థలమగు అక్యాబు ముఖ్యంగా రాయలు విమానదాడులకు గురియైనది. మేలో యీ వూరుపై 15 దాడులు జరిగినవి. అక్యాబులో ముఖ్యమగు జెట్టీ యిపుడు నిరుపయోగమయినది. బియ్యంమరలు నాశనమయినవి. వాయువార్తా కార్యాలయం చాల దెబ్బతిన్నది లేక పూర్తిగా చెడింది. ఒకమారు బరువైన బాంబరు విమానాలు 100 అడుగుల ఎత్తువరకు దిగి, అక్యాబు విమానాశ్రయాన్ని చేరువ భవనాలను, కొద్ది మైళ్ల దూరంలోనున్న శత్రుశిబిరాలను మరఫిరంగులతో కొట్టినవి.

రంగూను రేవులను బాంబుచేయడంలో అమెరికా వైమానికులు ప్రశిద్ధిగాంచిరి. చాల బరువైన బాంబులు వేసిరి. ఆ రేవులో పోయిన మాసం ఐదుసారులు దాడి జరిగింది.

రాయలు విమానదళంవారు చింద్విను నదిపైనున్న నౌకలపై బాంబులువేసినపుడు ఎక్కువ ఫలితం పొందిరి. శత్రునౌకలు నది దాటుచుండగ బ్లెనుహీం విమానాలు అకస్మాతుగ వచ్చి బాంబులువేయగా, నావికులు దాడివచ్చినట్లు గుర్తించేలోగా మూడు నౌకలను ములిగినవి.

మే మాసంలో ఆఖరు దినాలందు శత్రువుల చర్య లక్టే కనబడలేదు. బర్మాలో వారి విమానాశ్రయాలు పనికిరాకుండా చేయబడ్డాయి. అందుకే ఏమి చేయలేకుండా ఉన్నారు.

## మద్రాసు పటాలముల జనహాని.

మదరాసు పటాలములలో యీ దిగువ జనహాని కలిగిందని తెలుపుటకు చింతిలుచున్నాము :—

### కనబడనివారు.

ఇండియను ఆస్పత్రిదళం

| | | |
|---|---|---|
| 181529 | మంగలి ... | లక్ష్మణ |
| 192253 | వంటవాడు .. | అంబిక. |
| 193417 | వంటవాడు .. | అప్పాదురై. |
| 19274 | సిపాయి | ఎస్ ఎన్. చక్రవర్తి. |
| 189018 | నౌఖరు .. | దేవసహాయం. |
| 193416 | వంటవాడు | సందనస్వామి. |
| 167122 | వంటవాడు .. | తంబుస్వామి. |

### గాయపడినవారు.

| | | |
|---|---|---|
| 188812 | కుట్టుపని .. | కె. నాగియ్య. |
| 0/121964 | లాంసునాయకు. | ఒ. ఎ. పద్మనాభం. |
| 0/71231 | సిపాయి | ఎన్ మాయందిసామి. |

మదరాసు సేపర్లు మైనర్లు

| | | |
|---|---|---|
| 36720 | సేపరు . | కృష్ణస్వామి నాయుడు. |
| 60170 | సేపరు .. | మాడ చెట్టి. |

ఇండియాను ఇంజనీర్లు

| | | |
|---|---|---|
| 63633 | సేపరు . | గోవిందస్వామి. |
| 63056 | సేపరు .. | కె. కుంది రామ నాయరు. |
| 62600 | సేపరు ... | రాజా. |
| 63153 | సేపరు .. | రామచంద్ర రెడ్డి. |

### అదివరకు కనబడక యిపుడు చనిపోయినట్లు తెలిసినవారు.

| | | |
|---|---|---|
| 63559 | సేపరు | పరశురామను. |

MADRAS: PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.